# ఎలిజబెత్ ఫ్రై

## "Angel of Prisons"

చెరసాలలో ఉంటిని నా యొద్దకు వచ్చితిరి మత్తయి 25 : 36.

ఎలిజబెత్ గుర్నీ 1780 మే, 17వ తేదీన ఇంగ్లాండులోని అత్యంత ధనిక కుటుంబములో జన్మించింది. బాల్యము నుండి పూర్ణ హృదయముతో యేసు ప్రభువును వెంబడించింది. ఆమె తండ్రి జాన్ గుర్నీ ఉన్ని వర్తకుడు. ఇంగ్లాండులో గుర్నీ బ్యాంక్ వ్యవస్థాపకుడు. ఆమె తల్లి బార్క్లే కుటుంబము నుండి వచ్చినది. నేటికి కూడ ప్రపంచములో బార్క్లే బ్యాంక్ పెద్ద బ్యాంకుల్లో ఒకటి. ఆ కుటుంబము వారు ఇంగ్లాండులోని ఫ్రెండ్స్ చర్చి సభ్యులుగా ఉండేవారు. ఫ్రెండ్స్ చర్చి సభ్యులను ఇతరులు క్వాకర్స్ అనేవారు.

ఎలిజబెత్ 12వ ఏట ఆమె తల్లియైన కేథరిన్ మరణించింది. కేథరిన్‌కు 11 మంది పిల్లలు. అందరూ 17 సంవత్సరముల లోపు వారు. కేథరిన్ పిల్లలనందరినీ ఎంతో క్రమ శిక్షణతో పెంచింది. ఎలిజబెత్ గుర్రపు స్వారీ అంటే ఎంతో ఇష్టపడేది. ఆమెకు ఈ లోకంలో అన్నీ ఉన్నా సుఖభోగములవైపు మనస్సు మరల్చక ఎల్లప్పుడూ దైవ ధ్యానములో ఉండేది.

ప్రతి సంవత్సరము ఫిబ్రవరి నెలలో క్వాకర్స్ చర్చివారు వార్షిక సమావేశమును ఏర్పాటు చేసుకొనేవారు. ఆ చర్చికి వెళ్లేవారందరూ తప్పక ఆ సమావేశమునకు హాజరు అయ్యేవారు. అనేక తరములుగా గుర్నీ కుటుంబము వారు ఆ సమావేశమునకు హాజరగుచున్నారు. ఆ సమావేశములు మూడు నుండి ఐదు రోజులపాటు జరిగేవి. వాక్యోపదేశకులు అమెరికా నుండి, ఐరోపా నుండి వచ్చెడివారు. 1798లో విలియమ్ సేవరీ అనే అమెరికా బోధకుడు ముఖ్య ప్రసంగీకుడుగా వచ్చారు. అతడు చర్మ వ్యాపారి. సంఘములో ఉజ్జీవము రావలెనని ప్రసంగించుచూ తన స్వంత ఖర్చుతో

ఫ్రాన్స్, జర్మనీ, ఇతర ఐరోపా దేశములు తిరుగుచూ సువార్తను ప్రకటించేవాడు.




ఎలిజబెత్ తన ఏడుగురు సోదరీలతో ఆయన ప్రసంగమును వినుటకు వెళ్లింది. అప్పుడు ఆమె వయస్సు 18. ఆయన మాట్లాడుచుండగా ఆమె హృదయము కదిలించబడి దేవుని సేవ చేయాలని నిర్ణయించుకొన్నది. ఆ రోజే కొన్ని నిబంధనలను ఏర్పరచుకొన్నది. సమయమును వృధా చేయరాదు. వినోదమునకు సమయమును వెచ్చించుట సమయము వృధా చేయుటే అని భావించినది. ఎప్పుడూ సత్యమునే పలుకవలెను. తగ్గింపు మనస్సు (దీన మనస్సు) కలిగి ఉండాలి. ఇతరుల గురించి చెడ్డ విషయములు మాట్లాడరాదు. ఎవరిపైనా కోపపడరాదు. విలాసముగా జీవించరాదు. తన జీవితాంతము తనకు తానే విధించుకొన్న ఈ నిబంధనలను ఒక్కసారి కూడ ఎలిజబెత్ మీరలేదు.

ఎలిజబెత్ ధనిక కుటుంబములో జన్మించింది గనుక ధనికులు వెళ్లే పెద్ద పెద్ద హోటళ్లకు, ఎమ్యూజ్‌మెంట్ పార్క్‌లకు వెళ్లుచుండెడిది. విలియమ్ సావ్‌రీ గారి ప్రసంగము విన్న తరువాత అటువంటి స్థలములకు వెళ్లుట మానివేసినది. ఆ రోజులలో క్వాకర్స్ చర్చివారు తమ పిల్లలకు ఉచిత విద్య అందించుట కొరకు పాఠశాలలను నెలకొల్పెడివారు. ఇతర విద్యార్థులకు నామ మాత్రపు ఫీజు తీసుకొనేవారు. పేదవారైన విద్యార్థులకు చదువు నేర్పించాలనే ఉద్దేశ్యముతో ఆమె తన యింటిలో ఒక

గదిని ఖాళీ చేసి ఒక్క విద్యార్థితో పాఠశాలను ప్రారంభించింది. రెండు సంవత్సరములలో 70 మంది విద్యార్థులు ఆ పాఠశాలలో చేరి చదువుకొను చుండిరి.

క్వాకర్స్ చర్చివారు సనాతన క్రైస్తవులు. స్త్రీలందరూ నిరాడంబరమైన దుస్తులను ధరించేవారు. ఎలిజబెత్‌కు ఖరీదైన దుస్తులు ఉన్ననూ క్వాకర్స్ ధరించే దుస్తులను ధరించిన యెడల సువార్తను ఎక్కువగా ప్రకటించగలను అనుకొని తన ఆభరణములన్నియు తీసి ప్రక్కన పెట్టినది. సామాన్యమైన దుస్తులను ధరించినది. ఆ రోజులలో క్వాకర్స్ చర్చికి వెళ్లేవారందరూ వ్యాపారము చేసెడివారు. వారు స్టీలు వస్తువులను, బూట్లను, చాక్లెట్‌లను తయారు చేసెడివారు. తమ పనిలో ఎంతో నిజాయితీగా ఉండెడివారు. క్వాకర్స్ యొక్క ఉత్పత్తి అనగానే వినియోగదారులు ఏవిధమైన సందేహము లేకుండా దానిని కొనెడివారు. విదేశముల నుండి తేయాకును, సుగంధ ద్రవ్యములను దిగుమతి చేసుకొనెడివారు.

వారిలో చాల మందికి వాణిజ్య బ్యాంక్‌లు ఉండేవి. విలియమ్ ఫ్రై అను వ్యక్తి ఫ్రై బ్యాంక్‌ను స్థాపించెను. విలియమ్ కుమారుడైన జోసఫ్ ఎలిజబెత్‌ను చూసి ఆమెను వివాహము చేసుకొనుటకు ప్రతిపాదించాడు. ఎలిజబెత్‌కు అప్పటి వరకు వివాహము చేసుకొనవలెననెడి ఆలోచన లేదు. అవివాహితగా ఉంటే దేవునిని బాగుగా సేవించ వచ్చునని భావించెడిది. జోసఫ్ ఫ్రై ప్రతిపాదించిన తరువాత సంవత్సరము పాటు ఆలోచించి తన సమ్మతిని తెలిపింది. వివాహమైన తరువాత వారిద్దరూ నార్ఫోల్క్ నుండి లండన్ వెళ్లి అక్కడ నివసించుట ప్రారంభించారు. లండన్‌లో ఉన్న జోసఫ్ ఇంటిని మిల్‌డ్రెడ్ కోర్ట్ అనేవారు. ఆ ఇంటిలో కొంత భాగములో ఫ్రై బ్యాంక్ నిర్వహించబడెడిది.

లండన్‌కు క్వాకర్స్ చర్చికి సంబంధించిన ఎవరు వచ్చినా మిల్‌డ్రెడ్ కోర్ట్‌లోనే వారికి భోజన, వసతి సౌకర్యములు కల్పించబడేవి. క్వాకర్స్ చర్చికి

ప్రసంగీకులు ఎవరైనా వస్తే వీరి ఇంటిలోనే ఉండేవారు. అనేక తరాలుగా జోసఫ్ ఫ్రై కుటుంబము వారు లండన్ వచ్చే ప్రసంగీకులకు భోజన, వసతి సదుపాయములు కల్పించు చున్నారు. ఎలిజబెత్ లండన్ వచ్చిన తరువాత క్రమము తప్పకుండా క్వాకర్స్ చర్చికి వెళ్లేది. అప్పుడప్పుడూ వారిని ఉద్దేశించి ప్రసంగించేది. 9 సంవత్సరముల తరువాత ఆమె ఒక వర్కర్స్ హాస్టల్‌కు పాస్టరుగా నియమించబడింది.

ఆ రోజులలో ఇంగ్లాండులో నివసించే వారందరూ బ్రిటీష్ రాణి పేరున ఒట్టు పెట్టాలి. క్వాకర్స్ ఆ విధముగా ఒట్టు పెట్టుటకు నిరాకరించినందు వలన వారి పిల్లలకు ప్రభుత్వ పాఠశాలలలో ప్రవేశము నిరాకరించబడినది. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో గాని, కేంబ్రిడ్జి యూనివర్సిటీలో గాని వారికి ప్రవేశము నిరాకరించబడేది. సైన్యములో గాని, ప్రభుత్వ ఉద్యోగములో గాని వారికి అవకాశము లేదు. అందువల్ల క్వాకర్స్ తమ పిల్లల నిమిత్తము తామే పాఠశాలలను నెలకొల్పుకొన్నారు. ఇతర స్కూలు విద్యార్థుల కంటే వీరి పిల్లలకు మంచి విద్య అందేది. ఎక్కడా ఉద్యోగములు దొరకవు గనుక క్వాకర్స్ స్వంత పరిశ్రమలను నెలకొల్పుకొన్నారు. వారి నిజాయితీ వలన వారెంతో అభివృద్ధి చెందారు.

వివాహమై 12 సంవత్సరములు గడిచినవి. ఎలిజబెత్‌కు 8 మంది పిల్లలు పుట్టినారు. దేవుని కోసం ఏమైనా చేయాలని ఆశిస్తున్న సమయములో స్టీఫెన్ గ్రెల్లెట్ అనే ప్రసంగీకుడు అమెరికా నుండి ఎలిజబెత్ ఇంటికి వచ్చాడు. ఆయన ఫ్రాన్స్ దేశస్థుడు. ఆ రోజులలో అనేక మంది ఫ్రెంచ్ వారు లండన్‌లోని జైలులో ఉండేవారు. స్టీఫెన్ వారిని దర్శించి సువార్తను చెప్పి ప్రభువు దగ్గరకు నడిపించేవాడు. ఒక రోజు ఒక జైలులో వారికి సువార్తను ప్రకటించినప్పుడు అనేకమంది మారుమనస్సు పొంది కన్నీరు కారుస్తూ ప్రభువును అంగీకరించారు. దానిని చూసిన ముఖ్య పోలీసు అధికారి ఇంగ్లాండులోని ఏ జైలునైనా దర్శించుటకు అతనికి అనుమతి ఇచ్చాడు.

స్టీఫెన్ గారు న్యూ గేట్ జైలుకు వెళ్లి సువార్త ప్రకటించాడు. అది ఇంగ్లాండులో ఉన్న అతి పెద్ద కారాగారము. ప్రతి దినము స్టీఫెన్ ఆ జైలుకు వెళ్లి సువార్త ప్రకటించేవారు. మహిళా విభాగమునకు వచ్చినప్పుడు అక్కడ ఉన్న జైలు వార్డెన్ వారిని ఆపి "ఈ మహిళా ఖైదీలు మగవారికంటె బహు క్రూరులు. క్రూర మృగములవలె మిమ్ములను గోళ్లతో రక్కుతారు. పళ్లతో కొరికి వేస్తారు. అందువలన లోపలికి వెళ్లవద్దండీ" అని బ్రతిమాలాడు. తాను మరణించినా ఫరవాలేదు. కాని వారు తప్పక సువార్త వినాలని బ్రతిమాలిన తరువాత జైలు వార్డెన్ గేటు తెరిచాడు.

లోపల పరిస్థితి ఎంతో అధ్వాన్నంగా ఉన్నది. చాల మంది అనారోగ్యంగా ఉన్నారు. కొందరు కటిక నేల మీద నిద్రిస్తున్నారు. వారికి చలి నుండి రక్షించే దుస్తులు లేవు. వారికి పుట్టిన పిల్లలు ధరించుటకు అసలు దుస్తులే లేవు. స్టీఫెన్ బయటకు వచ్చి ఎలిజబెత్‌తో "నీవు అక్కడికి వెళ్లి చేయవలసిన పని చాల ఉన్నది" అని చెప్పుట వలన ఎలిజబెత్‌కు తన కర్తవ్యము అర్థమైనది.

మరునాడు ఎలిజబెత్ తన సోదరియైన హన్నాతో (హన్నా భర్త ఫోవెల్ భక్స్టన్. ఆయన పార్లమెంట్ సభ్యుడుగా ఎన్నికైనారు) కలసి న్యూగేట్ జైలుకు వెళ్లింది. తనతో కూడ కొన్ని దుప్పట్లు, ఉన్ని దుస్తులు తీసుకొని వెళ్లింది. వీరి ధైర్యమును చూసి జైలు వార్డెన్ ఆశ్చర్యపోయాడు. వారి వద్ద ఉన్న చేతి గడియారములు, పర్సులు ఇతర విలువైన వస్తువులు తనకు ఇచ్చి అప్పుడు లోపలకు వెళ్లమని చెప్పి వార్డెన్ లోనికి వెళ్లుటకు అనుమతి ఇచ్చాడు. ఆ జైలులో 300 మంది మహిళా ఖైదీలు వారి పిల్లలతో ఉన్నారు.

ఆ రోజులలో జైలు కిటికీ వద్దకు సారా తీసుకొని వచ్చి అమ్మేవారు. అందువల్ల మహిళా ఖైదీలు ఎలిజబెత్‌ను ధనము ఇవ్వమని అడుక్కొనుట ప్రారంభించారు. వారి భాష ఎంతో నీచముగా ఉన్నది. బూతు మాట లేకుండా ఒక్క పదము కూడ వారు

పలుకుట లేదు. ఎలిజబెత్ వారితో యేసు ప్రభువు గురించి చెప్పింది. హన్నా ప్రార్థన చేసింది. కొందరు స్త్రీలు ఏడుస్తూ మోకాళ్ల మీదకు కృంగి ప్రార్థన చేసారు. ఎలిజబెత్ "నేను రేపు మరలా వస్తాను. మరికొన్ని దుస్తులు తెస్తాను" అని చెప్పి తిరిగి వచ్చినది. ఇంటికి వచ్చిన వెంటనే తన పిల్లలతో ఈ విషయం చెప్పింది. వారంతా చిన్న పిల్లల కొరకు కొన్ని దుస్తులను సేకరించారు. కొన్ని ఆట వస్తువులను పిల్లల కొరకు సమకూర్చారు. రెండు రోజుల తరువాత ఎలిజబెత్ హన్నాతో కలసి రోగులుగా ఉన్న స్త్రీల కొరకు దుప్పట్లు తీసుకొని మరలా జైలుకు వచ్చింది.

ఆ తరువాత ఎలిజబెత్ మూడు సంవత్సరముల వరకు ఖైదీలను చూచుటకు వెళ్లలేకపోయింది. లండన్‌లో 1812లో వచ్చిన ఆర్థిక సంక్షోభము వలన ఆమె భర్త యొక్క బ్యాంక్ ఎంతో నష్టమునకు గురియైనది. ఆ అప్పులు తీర్చుటకు ఎంతో ఆస్తిని అమ్మివేయవలసి వచ్చింది. ఫ్రాన్స్‌తో యుద్ధము వచ్చుట వలన బ్రిటన్ యొక్క ఆర్థిక వ్యవస్థ అతలాకుతలమైనది. ఆ సమయములో ఎలిజబెత్‌కు తొమ్మిదవ సంతానము కలిగింది. ఆమె కుమార్తెయైన బెట్సీ ఐదు సంవత్సరాల వయస్సులో మరణించింది. ఒక సోదరుడు కూడ మరణించాడు.

మూడు సంవత్సరముల తరువాత ఆర్థికముగా కొంచెము కోలుకొన్న తరువాత న్యూగేట్ జైలునకు తన సోదరి హన్నాతో వెళ్లినది. వార్డెన్ భయపడుతూ వారిని లోపలికి అనుమతించాడు. ఆమె లోపలికి వెళ్లి బైబిల్ తెరచి మత్తయి సువార్త 20వ అధ్యాయము చదివి వినిపించిన తరువాత వారికి సువార్త చెప్పింది. వారిలో చాలమందికి యేసు ఎవరో తెలియదు. ఖైదీల పిల్లలు కూడ జైలులో ఉండుట వలన వారికి స్కూలు లేదు. తగిన పోషకాహారము లేదు. ఎలిజబెత్ మెజిస్ట్రేట్‌తో మాట్లాడి స్కూలు పెట్టుటకు అనుమతి కోరింది. ఆయన వెంటనే ఖాళీగా ఉన్న ఒక గదిని స్కూలుకు కేటాయించాడు. జైలులో ఉన్న పిల్లలూచ

25 సంవత్సరాలలోపు వయస్సుగల ఖైదీలూ చదువుకొనుటకు వచ్చారు.

జైలులో ఉన్న ఒక ఖైదీయైన మేరీ కోనర్ కొంచెము చదువుకొన్నది. గడియారము దొంగిలించినందుకు మేరీ కోనర్‌ని జైలులో వేసినారు. ఆమె పిల్లలకు చదువు చెప్పుటకు అంగీకరించింది. (మేరీ కోనర్‌చాల కాలము చదువు చెప్పింది. ఆమె సత్‌ప్రవర్తనకు అధికారులు మెచ్చి క్షమాభిక్ష ప్రసాదించారు. కాని క్షయ వ్యాధి సోకుట వలన విడుదల కాకముందే మేరీ కోనర్ మరణించింది) ఎలిజబెత్ తన చర్చిలోని కొందరు స్త్రీలను తనతో పరిచర్య చేయుటకు జైలుకు రమ్మని ఆహ్వానించింది. సుమారు 10 మంది స్త్రీలు ఆమెతో కలసి జైలులో సువార్త చెప్పుట ప్రారంభించారు. వీరి పరిచర్య వలన క్రూర మృగములవలె ఉన్న స్త్రీలు సాధు స్వభావము గల వ్యక్తులుగా మారారు. ఇద్దరు స్త్రీలు ప్రతి దినము జైలుకు వెళ్లి స్కూలులో బోధించుటకు అంగీకరించారు.

ఎలిజబెత్ ఖైదీల సంక్షేమము కొరకు ఒక అసోసియేషన్‌ను నెలకొల్పింది. వారు జైలులో క్రమంగా బైబిల్ చదివి వినిపించి వివరించేవారు. మరణశిక్ష పడిన ఖైదీలు కూడ వాక్యము వినుటకు వచ్చేవారు. వారికి ఏ పని లేకపోవుట వల్ల వృధా సంభాషణలతోను, కలహములతోను కాలము వెళ్లబుచ్చుచున్నారు అని గ్రహించిన ఎలిజబెత్ వారికి ఏదైనా ఆదాయము వచ్చే పని కల్పిస్తే బాగుండునని తలంచింది. ఆదాయము లేకపోవుట వలన చూచుటకు వచ్చిన వారిని భిక్షమెత్తుచున్నారు.

**(డేవిడ్ లివింగ్‌స్టన్ గారు ఆఫ్రికా వెళ్లినప్పుడు ఆదాయము వచ్చే పని లేకపోవుట వలన అక్కడి బలవంతులైన ప్రజలు బలహీనులైన వారిని బానిసలుగా శ్వేత జాతీయులకు అమ్మి బానిస వ్యాపారము చేస్తున్నారు. వారికి ఆదాయము వచ్చే పని కల్పిస్తే బానిస వ్యాపారము మానివేస్తారని డేవిడ్ లివింగ్‌స్టన్ గారు తలంచారు)**

ఎలిజబెత్ వారికి బొంతలు తయారు చేసే పని నేర్పించింది. బొంతలు కుట్టుటకు చాల సమయము పట్టేది గనుక ఖైదీలు ఎక్కువ సమయము పని చేస్తూ ఉండేవారు. దానివల్ల అల్లరి, కలహాము తగ్గిపోయింది. చలి దేశము గనుక వారికి ఊలు ఇచ్చి స్వెట్టర్లు, మేజోళ్లు అల్లటం నేర్పించింది. వీరి సేవను గుర్తించిన వ్యాపారస్తులు జైలులో తయారైన వస్తువులను కొనుటకు ముందుకు వచ్చారు. ఇతరచోట్ల కంటే జైలులో ధర తక్కువ ఉండేది. వారు సంపాదించిన డబ్బును వారి పేరు మీదే బ్యాంకులో డిపాజిట్ చేసి పాస్ బుక్‌లను వారి చేతికే ఇచ్చేది. వారు విడుదల పొందినపుడు ఆ డబ్బు వారు ఉపయోగించుకొనేవారు. జైలు ప్రాంతములో మద్యము అమ్మకుండా కట్టుదిట్టము చేసింది. టీ, పాలు, బిస్కెట్టులు అమ్ముట వలన వాటిని కొనుక్కొనుటకు ఖైదీలకు కొద్దిగా డబ్బులు ఇచ్చేవారు. డబ్బు సంపాదించే అవకాశము దొరికినందువల్ల ఖైదీలు ఉత్సాహంగా పని చేసేవారు.



ఖైదీలు రోజూ బైబిల్ వినేవారు. ఇప్పుడు వారికి ఏది మంచిదో, ఏది చెడ్డదో తెలుస్తున్నది. చాలమంది శీలమునకు విలువ ఇచ్చుట నేర్చుకొన్నారు. ఇప్పుడు ఎవ్వరూ బూతులు మాట్లాడుట లేదు. పొగాకు నములుట లేదు. తమ పిల్లలను క్రమశిక్షణతో పెంచుతున్నారు. చక్కగా దుస్తులు ధరిస్తున్నారు. ఆ రోజులలో చిన్న నేరములకు కూడ మరణ శిక్ష విధించేవారు. ఒక రోజు ఆరుగురు

పురుషులను ఒక స్త్రీని ఉరి తీసారు. పురుషులలో ఒకనికి ఏడుగురు పిల్లలు ఉన్నారు. అతని భార్య కూడ జైలులోనే ఉన్నది. ఉరి ప్రజలందరి సమక్షంలో ఇతర ఖైదీలందరూ చూచుచూ ఉండగానే అమలు చేసెడివారు. వారి ఏడ్పులు విన్న ఎలిజబెత్ మరణ శిక్షను రద్దుచేయాలని ఉద్యమించుట ప్రారంభించింది. 1817లో బ్రిటీష్ పీనల్‌కోడ్ వ్రాసిన వారు నేరములను తగ్గించుటకు ఉరి శిక్షే సరియైన మందు అని తలంచారు. అందువల్ల దొంగతనమునకు, దొంగ సంతకములు పెట్టిన వారికి (ఫోర్జరీ) మొదలగు 220 నేరములకు మరణ శిక్ష విధించెడివారు. ఒక రోజు బెయిలీ కోర్టులో కొంతమందికి ఉరి శిక్షలు విధించబడినవి. థామస్‌కు పరుపు దొంగిలించినందుకు, విలియమ్‌కు మేజోళ్లు దొంగిలించినందుకు, కెర్నర్‌కు ఆరు వెండి స్పూన్లు దొంగిలించినందుకు, రిచర్డ్‌కు గుర్రము దొంగిలించినందుకు, జాన్‌కు కోటు దొంగిలించినందుకు, జోసఫ్‌కు గొర్రెపిల్ల దొంగిలించినందుకు, పాస్‌కు రెండు గొర్రెపిల్లలను దొంగిలించినందుకు మొత్తము ఏడుగురికి మరణ శిక్ష విధించినారు. వారందరినీ ప్రజల సమక్షములో వారి బంధువుల ఎదురుగా న్యూగేట్ జైలు ముందు ఉరి తీసారు. వారు ఎక్కువ బాధపడకుండా చనిపోవుటకు వారి బంధువులు మెడకు ఉరి తగిలించగానే వారి కాళ్లను పట్టుకొని క్రిందకు గట్టిగా లాగెడివారు. అందువల్ల వారు త్వరగా మరణించేవారు. ఎలిజబెత్ "ప్రతీకార వాంఛతో ఉరి శిక్ష వేయుచున్నారు కానీ దానివల్ల నేరములు తగ్గవు. నేరస్తులను సంస్కరించుటయే చట్టము యొక్క పని" అనీ, "దయ లేకుండా జంతువులను చంపినట్లు మనుషులను చంపుట అన్యాయము" అని వాదించుట మొదలు పెట్టినది.

1818లో హేరియట్ అనే అందమైన యువతికి దొంగనోటు మార్చినందుకు ఉరి శిక్ష విధించబడినది. ఆమె ప్రేమించిన యువకుడు తెలివిగా ఆమెకు దొంగ

నోట్లు ఇచ్చి ఆమెను ఇరికించాడు. ఆమెకు ఉరి శిక్ష విధించ బడినందుకు పై కోర్టుకు అప్పీలు చేసుకొన్నది. తన మరణ శిక్షను యావజ్జీవ కారాగార శిక్షగా మార్చమని కోరిననూ అది నిరాకరించ బడినది. ఆమెను రక్షించుటకు ఎలిజబెత్ డ్యూక్ ఆఫ్ గ్లోసెస్టర్‌ను కలుసుకొన్నది. ఆయన హోమ్ సెక్రటరీయైన లార్డ్ సిర్డ్ మౌత్‌ను కలుసుకొని రద్దుచేయమని కోరినాడు. ఎలిజబెత్‌కు తెలిసిన బ్యాంక్ డైరెక్టర్లందరూ వచ్చి వినతి పత్రమును సమర్పించారు. అయిననూ హేరియట్‌ను ఉరి తీసారు.

బ్రిటన్‌లోని మేధావులందరూ నరహత్య చేసిన వాడికి తప్ప మిగిలిన నేరములు చేసినవారికి మరణ శిక్ష విధించకూడదని పార్లమెంటులో శాసనము చేయవలెనని కోరారు. వీరి కృషి ఫలితంగా 1823లో రాజ ద్రోహము, నరహత్య నేరములకు తప్ప ఇతర నేరములకు ఉరి శిక్ష విధించ కూడదని శాసనము పార్లమెంటులో తీర్మానించారు. అప్పటివరకు ఉరి శిక్ష పడినవారిని ప్రజల సమక్షంలో ఉరి తీసెడివారు. ఉరి శిక్ష పడిన ఖైదీని ఒక ప్రత్యేకమైన గదిలో ఉంచెడివారు. పత్రికా విలేఖరులు వారి పేరు, వారి నేరము, ఎప్పుడు ఉరి తీస్తారో తమ పత్రికలలో వ్రాసెడివారు. ప్రజలంతా ఆ దృశ్యము చూచుటకు గుమికూడేవారు. ఫుట్‌బాల్ ఆట చూచుటకు ఎంత మంది వస్తారో అంతమంది కంటే ఎక్కువమంది ఈ ఉరి తీయుటను చూచుటకు వచ్చెడివారు.

అయితే ఎలిజబెత్ కృషి వలన ఈ పరిస్థితి మారినది. దొంగ సంతకము చేసినందుకు చార్లెట్, మేరీ అను ఇద్దరు స్త్రీలకు ఉరి శిక్ష విధించబడినది. వారిద్దరూ జైలులో ఉండగా యేసు ప్రభువును రక్షకునిగా అంగీకరించిరి. వారిద్దరినీ ప్రత్యేక గదిలో ఉంచినప్పుడు వారు ఎలిజబెత్‌కు ఉత్తరము వ్రాసిరి. ఆ ఉత్తరమును వార్తా పత్రికలలో ఎలిజబెత్ ప్రచురింప జేసెను. ఆ ఉత్తరము చదివిన మనుషుల హృదయములో పశ్చాత్తాపము కలిగి ఉరి శిక్ష

చూచుటకు ప్రజలు రాలేదు. ఈ సంఘటన వలన ఎలిజబెత్ విషయము చాలమందికి తెలిసినది. ఇంగ్లాండులో చట్టము చేసే హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఇంగ్లాండు రాణి తప్ప మరి ఏ స్త్రీ అనుమతించబడరు. అయితే ఖైదీల సంక్షేమము కొరకు చర్చించుటకు ఎలిజబెత్‌ను హౌస్ ఆఫ్ కామన్స్‌కు అనుమతించిరి. ఆ విధముగా హౌస్ ఆఫ్ కామన్స్‌లో మొదటగా కాలుపెట్టిన స్త్రీ ఎలిజబెత్.

నేరస్తులను ఉరి తీయకుండా బ్రిటన్ యొక్క వలస ప్రాంతములైన ఆస్ట్రేలియాకు, అమెరికాకు వారిని పంపవలెనని హౌస్ ఆఫ్ కామర్స్‌లో నిర్ణయించబడెను. 7 సంవత్సరముల కంటే ఎక్కువ జైలు శిక్ష విధించబడిన నేరస్తులకు క్రొత్త, దేశములో క్రొత్త జీవితము ప్రారంభించుటకు అవకాశము ఇయ్యబడినది. ఈ విధముగా పంపబడిన వారిలో స్త్రీలు 20 శాతము ఉండిరి. (మన దేశములో అండమాన్ ద్వీపమునకు నేరస్తులను పంపెడివారు)

1868 వరకు 1,64,000 మంది ఖైదీలు ఆస్ట్రేలియాకు పంపబడ్డారు. చిన్న చిన్న నేరములు చేసిన వారిని కూడ ఆస్ట్రేలియాకు పంపుచుండెడివారు.

వారిని ఎంతో నీచముగా చూచుచు జంతువులవలె ఓడలో రవాణా చేసెడివారు. ప్రయాణములోనే 25 శాతము ఖైదీలు మరణించెడివారు. అప్పటి వరకు వారికి గార్డులుగా మగ పోలీసులే ఉండే సాంప్రదాయమునకు ఎలిజబెత్ స్వస్తి పలికింది. ఖైదీల కాళ్లకు సంకెళ్లు వేసెడివారు. వారిని గుర్రపు బండిలో ఓడరేవు ప్రాంతమునకు తీసుకొని వెళ్లేవారు. దారి పొడవునా ప్రజలు వారిని అవమాన పరచేవారు. మట్టి విసిరేవారు. ఎలిజబెత్ జైలు సూపర్ఇంటెండెంట్ వద్దకు వెళ్లి కాళ్లకు సంకెళ్లు వేయకూడదనీ, మూసి ఉన్న గుర్రపు బగ్గీలో తీసుకొని వెళ్లాలని కోరింది. మహిళా ఖైదీలకు మహిళా గార్డులను నియమించాలని ఆమె ఒత్తిడి తెచ్చినందువల్ల చాల మేలు జరిగినది.

ఆస్ట్రేలియాకు తరలించే ఖైదీలతో మాట్లాడుతూ రాత్రి చాల పొద్దుపోయే వరకు జైలులోనే ఉన్నది. రేపు ఓడ వరకు మీ దగ్గరకు వస్తానని వాగ్దానము చేసింది. వెళ్లే ఖైదీలకు మిగిలిన ఖైదీలందరూ తమ వద్ద ఉన్న బట్టలను, ధనమును ఇచ్చారు. మరునాడు ఉదయము ఎలిజబెత్ బైబిల్‌ను, ఒక దుస్తుల జతను, తలకు పెట్టుకొనే టోపీని, ఒక సంచిని తెచ్చి ప్రతి ఒక్క ఖైదీకి అందజేసింది. వారు జైలులో ఉండే కాలములో అల్లిక పనులు నేర్చుకొన్నారు గనుక అల్లికకు కావలసిన 100 సూదులను, వివిధ రంగులలో ఉన్న ఊలును ఇతర సామగ్రిని తెచ్చి వారికందరికీ ఇచ్చింది. వానితోపాటు 14 మంది పిల్లలు వెళ్లుచున్నందువల్ల వారికి కావలసిన పుస్తకములను, పెన్సిళ్లను, పలకలను, బలపములను తెచ్చి ఇచ్చింది. వారితో "మంచిగా ఉండండి, యేసు ప్రభువును నమ్ముకొనండి, రోజూ ప్రార్థన చేసుకొనండి" అని చెప్పింది. ఆనాటి నుండి 1843లో తాను అనారోగ్యము పాలయ్యేవరకు ఎలిజబెత్ ప్రతీ ఓడను దర్శించి వారికి కావలసిన వస్తువులను ఇస్తూ వచ్చింది. ఆమె ఆస్ట్రేలియాకు వెళ్లే 106 ఓడలను దర్శించింది. 12,000 మంది ఖైదీలకు వారికి కావలసిన వస్తువులను అందజేసింది.

ఎలిజబెత్ జైలులోని నేరస్తులను సంస్కరించుటకు ఆశించేవారు ఈ క్రింది విషయములను గమనించవలెను అని చెప్పు చుండెడిది. 10 అధ్యాయములతో ఒక చిన్న పుస్తకమును ఎలిజబెత్ వ్రాసింది. జైళ్లను సంస్కరించాలనే వారికి అది ఎంతో ఉపయోగ పడింది. జైలు పరిచర్య చేయాలని ఆశించే వారికి అది ఒక గైడ్ వంటిది. పరిచర్య చేయు వారు దయతో ఉండవలెను. మీరు నేరస్తులు మేము నేరము చేయని వారము అనెడి భావనతో జైలుకు వెళ్లరాదు. మనమందరము గొర్రెలవలె త్రోవతప్పి ఏకముగా పనికిమాలిన వారమైతిమి (రోమా 3 : 12) అను మాట ప్రకారము మనమందరము నేరస్తులమని గ్రహించు కొనవలెను. మార్పు వెంటనే రాదు. ఓపికతో వారిని సంస్కరించుటకు ప్రయత్నించవలెను.

వారిని కించపరచ రాదు, వారి తప్పులను అస్తమానం ఎత్తి చూపరాదు. వారిలో రోగ గ్రస్తులైన వారిని ప్రేమతో ఆదరించవలెను. కావలసిన వైద్య సదుపాయము అందించవలెను. వారికి శుభ్రత నేర్పించవలెను. కేవలము మత సంబంధమైన పుస్తకములను మాత్రమే గాక వారి విజ్ఞానమును పెంచు పుస్తకములను అందుబాటులో ఉంచవలెను.

1821 ఎలిజబెత్ తన భర్తతోను, తన ఇద్దరు కుమార్తెలతో వ్యాపారము నిమిత్తము నాటింగ్‌హామ్, లింకన్, వేక్ ఫీల్డ్, లీడ్స్, లివర్‌పూల్ మొదలగు పట్టణములను దర్శించినప్పుడు అక్కడ ఉన్న జైళ్లను దర్శించింది. ఆ పట్టణములలో ఉన్న చర్చిలను దర్శించి ఆ స్త్రీలను జైళ్లను దర్శించమని ప్రోత్సహించింది. జైలులో తప్పక బైబిల్ చదువబడాలి. అందువల్ల ఆ పట్టణములో కూడ జైళ్లలో సంస్కరణ మొదలైనది. ఆమె ఐర్లాండ్, స్కాట్లాండ్ మొదలగు దేశములను కూడ దర్శించి అక్కడి జైళ్లను కూడ సంస్కరించింది. జైళ్లను దర్శించుటకు 5 సార్లు ఐరోపా వెళ్లింది.

లండన్‌లో చాల చలిగా ఉన్న రోజు ఒక వీధి బాలుడు చలికి బిగుసుకొని చనిపోయినాడు. ఆ విధముగా చాల మంది చనిపోవుచున్నారని గ్రహించి ఏ ఆశ్రయము లేని బాలలకు, స్త్రీలకు రాత్రులందు నిద్రపోవుటకు లండన్‌లో ఒక భవనమును నిర్మించినది.

1825లో ఎలిజబెత్ భర్తయైన జోసఫ్ ఫ్రై యొక్క బ్యాంక్ దివాలా తీసినది. ఆ సమయములో ఎలిజబెత్ యొక్క సోదరులైన జాన్ గుర్నీ, సామ్ గుర్నీ ఇద్దరూ సహాయపడినారు కానీ మూడు సంవత్సరముల తరువాత ఆర్థిక సంక్షోభము వలన వారి బ్యాంక్ మూతపడింది. జోసఫ్ 600 పౌండ్లు జీతమునకు ఒక టీ ఎస్టేట్‌లో పనిచేయుటకు వెళ్లాడు. ఎలిజబెత్ సోదరులు ప్రతి నెల ఆమెకు 500 పౌండ్లు జైలు పరిచర్య ఆగకుండా చేయుటకు ఇచ్చేవారు. సంవత్సరము తరువాత ఎలిజబెత్ ఆర్థిక సంక్షోభము నుండి గట్టెక్కారు.

1824లోనే ఎలిజబెత్ ఆరోగ్యము క్షీణించింది. డాక్టర్లు సముద్రపు గాలి పీలిస్తే మంచిదని సూచించుట వలన బ్రిగ్టన్ పట్టణమునకు వెళ్లారు. ఆమె కిటికీలో నుండి చూస్తున్నప్పుడు స్మగ్లర్లను, సముద్రము ద్వారా మాదక ద్రవ్యములను రవాణా చేస్తున్న వారిని పట్టుకొనుటకు గస్తీ తిరుగుతున్న తీర ప్రాంత పోలీసులను (కోస్ట్ గార్డులు) చూసింది. వారికి బైబిళ్లను, క్రైస్తవ సాహిత్యమును అందజేస్తే ఖాళీ సమయములో వాటిని చదువు కొంటారనీ తలంచింది. అధికారులను సంప్రదించి అందుకు అనుమతి తీసుకొన్నది. ఆమె కృషి వలన సుమారు 500 లైబ్రరీలు, తీర ప్రాంత పోలీసు స్టేషన్‌లలో నెలకొల్పబడ్డాయి. జర్మనీలో పాస్టరుగా పనిచేస్తున్న ఫ్లీడ్‌నర్ గారు ఇంగ్లాండు వచ్చినప్పుడు ఎలిజబెత్ యొక్క పనిని చూసారు. ఆయన తిరిగి జర్మనీ వెళ్లినప్పుడు ఆమె వలెనే జైళ్లలో సేవ చేయవలెనని డుసిల్‌డోర్ఫ్ జైలులో పరిచర్య ప్రారంభించారు. సంవత్సరము తరువాత జైలు నుండి విడుదల పొందిన స్త్రీలకు ఒక ఆశ్రమము కట్టించారు.

వేశ్యా వృత్తిలో ఉన్న స్త్రీలకు పునరావాస సౌకర్యం కల్పించాలని ఆమె ఆశించింది. కాని ఆరోగ్యము సరిగా లేనందు వలన ఎలిజబెత్ ఆ పని చేయలేకపోయింది. ఆమె మరణించిన రెండు సంవత్సరములకు ఆమె స్నేహితులు దానిని నెలకొల్పారు. 1845 అక్టోబర్ 12న ఆమె ప్రశాంతముగా ప్రభువునందు నిద్రించినది. బార్కింగ్‌లోని క్వాకర్స్ చర్చికి చెందిన సమాధుల దొడ్డిలో ఎలిజబెత్‌ను భూస్థాపన చేసారు. దేశ నాయకులు మరణించినపుడు జాతీయ జెండాను సగము వరకు ఎగురవేస్తారు. తీర ప్రాంత పోలీసులు ఆమె గౌరవార్థము జెండాను అవనతం చేసారు. వెయ్యి మందికి పైగా ప్రజలు ఎలిజబెత్ అంత్య క్రియలకు హాజరయ్యారు.

ఎలిజబెత్ ఫొటోతో ఇంగ్లాండులో 5 పౌండ్ల నోటును ముద్రించి అమెను గౌరవించారు. ఆమె గౌరవార్థము పోస్టల్ స్టాంపును కూడ 1976లో విడుదల చేసారు.

శిక్ష ప్రతీకారము కొరకు కాదు కాని నేరములు తగ్గించుటకూ మరియు నేరస్థులను సంస్కరించుటకు మాత్రమే!

Punishment is not for revenge, but to lessen crime and reform the criminal.

Elizabeth Fry

